288

# శాస్త్రాలెందుకు?

శ్రీ జంపన

ప్రాప్తిస్థానము :
వెంకటేశ్వర
పబ్లిషింగ్ హౌస్,
ప్రొ. యం. వి. అప్పారావు
అండ్ సన్స్, రాజమండ్రి.

6
అణాలు

# i

"Man is to become divine by realising the divine. Idols or temples or churches or books are only the supports, the helps, of his spiritual childhood: But on and on he must progress"

Swamy Vivekananda
I Vol.

అది ఇనుప ఊచల పంజరం.

దానిలో రామ చిలుక. అటూ ఇటూ మనసు బొగోని ఖయిదీలా తిరుగుతూంది. వేసవి. కుతిప వేళల్లో ఉక్కబోస్తుంటే ఉక్కిరి బిక్కిరయ్యే ప్రాణిలా కొట్టుకు పోతూంది. పక్షుల జంటలో ఒకపక్షిని చంపి కిరాతకుడు సంచిలో వేసి తీసుకుపోతూంటే, ఆసంచివంక, అతడుపోయే మార్గం వంక మిగిలినపక్షి ఎంతజాలిగా చూస్తుందో, అంత జాలిగా అటూ ఇటూ పోయే వారివంక చూస్తూంది... పొంగి పొరలే నిండు యౌవనంలో పొదలు దాటుతూ, భంగు భంగుమని రింగులు తిరిగే కురంగి కాళ్ళను నరికి, బోనులో వేసి బంధించి, మహా ఘనకార్యం చేశానని బోరవిరచుకొని నిలబడిన వేటవానివంక ఎంత జాలిగా ఆలేటి ముద్దరాలు చూస్తుందో, అంతజాలిగా ఆపెంచిన వానివంక చూస్తూంది- పాపం [illegible].

"రామం! పాపను పిలువమ్మా!" అని యజమాను రాలు, పాపాయినెత్తుకొని అన్నం తినిపిస్తూ అంటే—

'రా! రా! పాపా! రా!" అంటుంది- ఈఖయిదీ సుఖం తెలుసుకుందుపుగానిలే- రా అన్నట్లు- ఆచిలుక. •

వేకువ చల్లగాలుల్లో రెక్కలు రెపరెపా కొట్టుకొంటూ, సర్వస్వాతంత్ర్య సామ్రాజ్య చక్రవర్తిలా ఒకయింటి కప్పు నుంచి మరొక యింటి కప్పుపైకి ఎగిరిపోతూ, తీవిగా, తీయగా, హాయిగా, 'కొక్కురోకో!' అని మెడసిక్కించి కూస్తూ, సృష్టిని మేలుకొల్పే కోడిపుంజును చూస్తుంది. హృదయం స్వతంత్ర వాయువులతో చెమరుస్తుంది. భావాలు ఆనందతరంగాలపై ఊగులాడిపోతాయ్. ఒడలు విరచుకుంటూ లేస్తుంది. తన రెండు రెక్కలూ ఏనాడో బంధింప బడ్డాయని మరచి ఎగరబోతుంది. అంతే, పాపం! రెక్కలు ఇనుప ఊచలకు తగుల్కొని ముక్కలౌతాయ్. చిలుక చిన్నారి ఆశలూ ముక్కలై చెక్కలమీద రాలిపడతాయ్.

సిగ్గుపడి నాలుగుమూలలూ చూస్తుంది.

"ఓసి బానిస పీనుగా! నీకు స్వేచ్ఛాజీవితం కూడానా? అన్నట్లొక్కమారే దిక్కులన్నీ పక్కుమని నవ్వుతాయ్. దానిప్రాణాలు నిలువు నిలువునా కుంగిపోతాయ్.

తనశరీరం అంతా కలయజూచుకుంటుంది. తనలో తనకే ఆశ్చర్యం కలుగుతుంది... 'ఇది నాశరీరమేనా? లేక

చిలుక బొమ్మకు 'కీ'ఇచ్చి అటూ ఇటూ తిప్పుతున్నారా...
నేనేలోకానికి చెందుతాను? బ్రతికున్న మానవ లోకానికా?
చచ్చిన ప్రేతలోకానికా? లేక ఏలోకానికీ చెందనా?...
ఇది కలా? లేక వలా?... సత్యమా? లేక భ్రాంతా?...
ఇవి రెక్కలా? లేక బ్రతుకబాలని బానిస కనుల్లపై జారే
కన్నీటి తెరలా?... ఇవి కారే కన్నీటి బొట్లులా? లేక హం
తకుని చిత్రవధ చేయగా ఎగజిమ్మిన నెత్తుటి బొట్లులా?

- - - - - - - - - - - - - - - - -

- - - - - - - - - - - - - - - - - -

నాలోని శాంతి పంజర[illegible]ని ఏ బాధా జీవితంలో [illegible]దో!
నాలో మూర్తే ఆశ ఏ ప్రియురాలి పెదవి సంధ్యలో కుంకుమ
రేఖలు దిద్దుకుందో! నాలో నలిగిపోయే వాంఛ ఏ స్మృతి కళే
బరం చుట్టూ వీడలేక తిరుగుతూందో!! నాలో ఆరిపోయే
కాంతి ఎవని ఉరితాళ్ళ చిక్కుకుపోయిందో?

— — — — — — —

అబ్బా! పూలరేకులు రాలిపోయినా, పూలవాసన
సహవాసంచే రేకులను విడలేక, ఆతీవ చుట్టూ తిరిగి తిరిగి
బావురుమని ఏడ్చినట్లు, నాలోని సర్వస్వంనానుండి వేరైపో
యినా; నామురికి జీవం నన్ను విడిచి పోలేక ఈ ఇనుపఊచలు
పట్టుకు వేలాడుతూంది. ఎందుకో? ఎందుకో ఈ బానిసకుకూడా

జీవితాశ!!" అని వేయివిధాల అనుకుంటూ బాధ పడుతూ ఉందా అన్నట్లు చిలుక కళ్లు కనబడుతూ ఉంటాయ్.

♦ ♦ ♦ ♦

ఆ చిలుకను చూస్తే ఎక్కడలేని జాలి యజమానునకు–

ఆ చిలుకను చూస్తే ఎక్కడలేని సరదా యజమానురాలికి—

ఆరోజు ఉదయం పనసతొనలు చిలుకకు వేస్తూ, ఆ చిలుక తింటూఉంటే పరమానంద భరితరాలై పోతూంది ఆ యింటి యజమానురాలు పుష్పం. స్నానంచేసి బట్టలువేసుకొని తలదువ్వుకుంటూ ఆమెదగ్గరకు వచ్చాడామె భర్త సుందరం—

"పుష్పం! ఏమిటి మా ఉషారుగా ఉన్నావ్?

"చూడండి... మన చిలుక ఎంత ఆనందంగా తింటూందో!

కడుపు మలమలా మాడిన ఖయిదీ గంజికూడైనా అలాగే ఆనందంతో తింటాడు-"ప్రాణాలు నిలుపుకుంటానికి అదైనా దొరికిందికదా అని. అతడు తన ఇంటిదగ్గరుండి తన తల్లిపెట్టే పప్పెడు మెతుకులు తినేటప్పటి ఆనందం, ఇప్పటి ఆనందం ఒకటేనంటావా?

కాకపోవచ్చు.

అంతే ఇదీను...ఆ చిలుకనే అడివిలో విడిచిపెడితే స్వతంత్రంగా తిరుగుతూ, ఆ చెట్టునుంచి ఈ చెట్టుకు, ఈ చెట్టు

నుంచి ఆ చెట్టుకూ ఎగురుతూ, చెట్టునపండిన పళ్ళనుతింటూ ఎంత ఆనందంతో ఉంటుందో ఊహించావ్ ?

ఆఁ దానిబొంద...ఆనందం ఏమిటి అజ్ఞానం...ఏ వేటగాడో నచ్చి కొట్టుకుపోయేవరకే అడవి పక్షులన్నిటికీ అర్థాయుష్షే... అందులో ఈ మాంసాహారులు ఎక్కువైనకొద్దీ వాటికి పాపం శాంతే ఉండడంలేదు. ప్రతి క్షణం మృత్యు గండమే. సూదర్శివాళ్ళు కొంతమందిని చూడండీ కన్నబిడ్డలా మేకల్నీ, కోడుల్నీ పెంచి దినాలకని, వాళ్ళ శ్రాద్ధాలకని వాటిని చంపి రాక్షసుల్లా తింటారు. తినగా మిగిలిన మాంసం ఎండవేసి, శవాల్నితినే రాంబందుల్లా తింటారు... అబ్బా! తలుచుకుంటేనే రోతవేస్తూంది. చచ్చిన శవాలను శ్మశానంలో పూడ్చినట్లు, వీటిని చంపి వారి పొట్టలను శ్మశానాలుచేసి పాతివేస్తారు. కన్నబిడ్డలను చంపి రక్తం తాగే పెద్దపులుల్లా, వీటిని చంపి రక్తం తాగుతారు. ఎముకలను పటపటా కొరికి, మాంసం నమిలి, రక్తం త్రాగే రాక్షస కృత్యంచేస్తూ మహాత్ములనుకుంటారు ఈ అహింసాయుగంలో కూడా - - -

బాగానేఉంది ఉద్రేకం—ఇంతకూ ఏమంటావ్?

అడవుల్లోఉంటే వేటగాళ్ళ పాలౌతాయి కాబట్టి, ఇంట్లోపెంచి వాటి ప్రాణాలు కాపాడ్డం మనధర్మమనీ- ఇంట్లో పెంచినట్లే పెంచి కొవ్వుపట్టాక కోసుకుతినే శూద్రవాళ్ళలా ఘోర రాక్షసకృత్యం మనం చెయ్యంకాబట్టి తప్పులేదంటాను,

ఆమె అమాయికత్వానికి కతఃడొక చిరునవ్వు నవ్వాడు.

పుష్పం! నరకానికి రాజై శాశ్వతం బ్రతికేదానికంటే, స్వర్గంలో ద్వారపాలకుడై ఒకరోజు బ్రతికితే చాలు. కాకి కలకాలం బ్రతికేదానికంటె హంసై ఆరు నెలలు బ్రతకడం మేలంటారు విన లేదూ-అలాగే బానిసై నూరేళ్లు బ్రతికేదాని కంటే, స్వతంత్ర జీవియై ఒక్కరోజు బ్రతకడం మేలు.

స్వతంత్రమో, బానిసత్వమో, ఆనందంగా ఉంటే చాలదూ?

ఆ ఆనందం స్వతంత్రంమీదే ఆధారపడి ఉంది. స్వతం త్రంలేంది ఆనందం లేదు.

ఇప్పుడు లేక చస్తున్నామా? సుఖంగా బ్రతుకుతూంటే ఎందుకొచ్చిన మాటలండి ఇవి?

పుష్పం! స్వతంత్ర జీవితంలోని మాధుర్యం, నేటి వరకూ బానిసత్వంలో పెరిగిన నీవు అర్థంచేసికోలేవు. అది నీ తప్పుకాదు. ఆడదానికి చదువవసరం అని నీకు చదువు చెప్పించని మీ తల్లిదండ్రులది తప్పు—

చదువురాని ద్విపాద పశువునని తెలిసీ నన్ను పెళ్ళా డిన మీది తప్పు కాదూ? చాల్లెండి... నన్నన్నది చాలక మా అమ్మానాన్నలను కూడా అంటున్నారు...'శుభం కోరవ య్యాఅంటే ,పెళ్ళికూతురు ముండెక్కడుందో'' అన్నట్లు చిలకనిమాచి పొండీఅంటే విడిచిపెట్టమంటారా? ఎంత చక్క గామాదడీ వాదన.

ఆమె మూతి మూతువంకలు తిప్పి కోపంతో గదిలోకి చక్కాపోయింది. సుందరం నవ్వుతూ ఆమె వెంటే వెళ్ళి, బుజ్జగిస్తూ ఇలా ప్రారంభించాడు.

వుష్పం! ఎందుకే కోపం? చదువురానిదానిని చేసుకున్నాననుకో, చదువుచెప్పి నావంటి విజ్ఞానిని చెయ్యకూడదూ? అలా ఎంతమంది చేశారు?

చాలామంది చేశారు గాని ఒక్క మాట అడుగుతా చెప్పండి?

ఊఁ అడుగు. అంతకంటేనా?

స్వతంత్రం, స్వతంత్రం అని నలుగురూ అంటున్నారని మీరూ అంటున్నారుకదా—స్వతంత్రం అంటే ఏమిటి?

పారతంత్రం లేకపోవడం స్వతంత్రం.

అంటే.

మనలను పరులు పాలించకుండా, మనలను మనమే పాలించుకోడం స్వతంత్రం.

ప్రపంచంలోని మానవులంతా ఒకే కుటుంబానికి చెందినపుడు, వారూ వీరనే భేదభావం ఎందుకుండాలి? అంతా ఒకటే అయినప్పుడు స్వదేశీయులు, విదేశీయులనే భేదం ఏమిటి?

ఏమిటా?…అందరి ఇళ్ళూ ఒకటేఅయినా, ఎవరి ఇంటిని వారెలా చక్కబెట్టుకొంటున్నారో, అలాగే అన్ని దేశాలూ ఒకటేఅయినా ఎవరిదేశం వారు చక్కబెట్టుకో

వాలి. అప్పుడందరకూ సౌకర్యంగా ఉంటుంది. ఎవరి అభి రుచులబట్టి వారు తమ దేశాన్ని అభివృద్ధి చేసుకోవచ్చు. ఎవరి ప్రాచీన ఆధునిక నాగరికతలు వారు కాపాడుకోవచ్చు. ఏ దేశాని కా దేశం ఇలా స్వతంత్రతతో అభివృద్ధిచెందినపుడే విశ్వమానవ కల్యాణం చేకూరుతుంది. అంతేగాని ఆంగ్లే యుల అభిరుచులు హైందవులమీద వేసి రుద్దకూడదు. హైం దవుల అభిరుచులు మరొకరిమీద వేసి పులమరాదు. అలా చేయడం చాలా అన్యాయం; అక్రమం; అయోగ్యం; అమా నుషం; అసహ్యం; అనాగరలక్షణం...

అసలు మనకున్నా నాగరికత ఏముందండీ?

ఏముందా? చెప్పలేనంత...మనకున్నా నాగరికత న్యాయతా సృష్టిలో మరేదేశానికీ ఉండదనుకుంటాను. ఎలా గంటే మన దేశంలో వైదిక విజ్ఞానం వెల్లివిరిసిన దినాలలో పాశ్చాత్యదేశాలవారు ఆత్మానాత్మ వివేకవిజ్ఞానం కూడా అలవరచుకోలేపోయారు. దివ్యదృష్టితో చూచి గర్భోత్పత్తి విధానం సవిస్తరంగా చెప్పగలిగిన నాటి మన ఋషుల విజ్ఞా నం, నేటి మహాశాస్త్రజ్ఞునికికూడా లేదు. దివ్యదృష్టితోచూచి నక్షత్ర పరిణతి చెప్పగల వారి ఖగోళ శాస్త్రజ్ఞానం, నేటి కాలపుమహాశాస్త్రజ్ఞునకు కూడాలేదు.

కాని ఒక్క విషయం మరచిపోకూడదు. ఏంటంటే ప్రజా నాగరికత ప్రభుత్వపరిపాలనావిధానంమీద ఆధారపడి ఉంటుంది. మన దేశంలో ద్రావిడులున్నపుడు ద్రావిడనాగ

రికత, ఆర్యులు దండె_త్తివచ్చినప్పుడు ఆర్యనాగరికత, మహమ్మదుల పరిపాలనలో ఉన్నప్పుడు మహమ్మదీయ నాగరికత, నేడు ఆంగ్లేయ పరిపాలనలో ఆంగ్లేయనాగరికత మనకు సంక్రమించాయ్.

ఇంతకూ మన నాగరికత లేదంటారు?

హైందవ నాగరికత.

నేనిక్కడే ఒప్పుకోను. హైందవ నాగరికత, ఆంగ్లేయ నాగరికత అని గిరి కేసి, మడికట్టకూడదంటాను. సూర్య తేజస్సు అందరకూ ఎలా ఒక్కటో, అలాగే నాగరికత అందరకూ ఒకటే. ఇందులో తరతమ భావం ఉండకూడదు.

పుష్పం! ఎవరి నాగరికత వారు కాపాడుకోడం అంటే ఇతర నాగరికతలను తృణీకరించడం అనుకోకు. ఎవరి దేశ స్వతంత్రం వారు కాపాడుకోవడం, ఇతర దేశాలను ద్వేషించడం అనుకోకు. చాలామందికున్న పొరపాటు అభిప్రాయమే అది. మనకు స్వతంత్రం వస్తే ఇతర దేశాలపై సౌభ్రాతృత్వం వృద్ధి అవుతుందే కాని, విరోధభావం వృద్ధికాలేదు. అలాగే ఎవరి దేశం వారు అందంగా ఉంచుకుంటే, సృష్టికే ఒక ఆనంద ముద్ర వేస్తారన్నమాట. ఎవళ్లు వారు చక్కబెట్టుకుంటే, పట్టణం తనంతతానే చక్కబడుతుంది. అన్ని పట్టణాలు బాగుపడితే దేశం సౌభాగ్యవంతంగా ఉంటుంది. అన్ని దేశాలూ సౌభాగ్యవంతంగాఉంటే, సృష్టంతా అప్పుడే సర్వకళా విలాస భాసురంగా ఉంటుంది.

ఏమిటో లెండి—ఈ స్వప్నంతా ఈ దేహానికి ఒక ఖయిదు. ఈ దేహం ఆత్మకు ఖయిదు. నిజానికి దేశ స్వాతంత్రం కంటే ఆత్మస్వాతంత్ర్యంముఖ్యం.

కాదనను పుష్పం. కాని ఆత్మ స్వతంత్రం దేశ స్వతంత్రంమీదే ఆధారపడి ఉంటుంది.

అదెలా?

చానినకసలు స్వతంత్రభావాలే ఉండవు. స్వతంత్ర భావాలులేని వారి కాత్మస్వతంత్రంఎలాగుంటుంది? అరవింద ఘోష్‌గారు చెప్పినట్లు మానవ జీవితం మార్చడానికి పనుల కంటె భావాలు ముఖ్యం.

ఇంక అలాగైతే స్వరాజ్యం ఎందుకు? స్వతంత్ర భావాలతో ఉందాం.

స్వతంత్రభావాలందరికీ ఉంటే, స్వరాజ్యం అప్పుడే వస్తుంది.

దానిలో అప్పుడు మీకో మాంచి స్థానం ఇస్తాంలెండి.

ఊహూఁ

ఇంక త్రోవకడ్డులేవండి. వంటకు ప్రొద్దెక్కుతూంది ఆలశ్యం అయితే మళ్ళీ కారాలు మిరియాలూ నూరతారు.

ఆమె నవ్వుతూ వెళ్ళిపోయింది.

అతడు ఆలోచిస్తూ కూర్చుండిపోయాడు.



## ii

రోజులు గడుస్తూన్నాయ్.

భార్యా చెప్పిందంతా భర్త వింటాడు. భర్త చెప్పిం దంతా భార్యా వింటుంది. కాని ఒకరు చెప్పింది మరొక రెన్నడూ ఆచరించడంలేదు. అందుచేత ఎడముఖాలూ పెడ ముఖాలూ పెట్టుకోడం అంతకంటే లేదు.

భావాలు వేరు; మతాలు వేరు; మార్గాలు వేరు; కాని కలిసిమెలిసి ఉంటూనే ఉన్నారు.

ఆ రోజు మంగళవారం.

ఉదయంలేచి కాలకృత్యాలు నిర్వహించుకొని సుంద రం మంగలపొది బయటకు తీశాడు.

'కేశవాయమంగళం. అనంతాయమంగళం. అచ్యు తాయమంగళం.' అంటూ గదిలో పూజానంతరం హారతి నిస్తూ అంటుంది పుష్పం.

"విష్ణుస్తోత్రం అయింది ఇంక లక్ష్మీస్తోత్రం ఉంది కాబోలు" అంటూ ఆగదిప్రక్కనుంచి మంగలి పొదిపట్టుకొని వెళుతూన్న భర్తను చూచింది.

'పదపద. నీపొదితో ఎంతదూరం వెళ్ళగలవు," అన్న ట్లు తలూపి, కాస్త స్తోత్రపాఠం త్వరగా ముగించి, బయటకు వచ్చింది పుష్పం,

అంతలో గడ్డానికి సబ్బుపూసుకొని, రెండు ఇంచిల వరకూ గొరుక్కున్నాడు సొంతంగా. దానితో పుష్పం నిప్పులు కక్కుతూ ప్రళయమూర్తిలా ప్రత్యక్షం అయింది.

"చదువుకొన్నకొద్దీ ఉన్నమతి పోతుందన్నట్లు, మంగళవారప్పూటా ఈఅనాచారలేమిటి? అవ్వ! మంగళవారప్పూటా మంగలిక్షౌరాలా? రామరామ. ఎంతఅనర్థం! ఎంత అనర్థం' అంటూ అద్దం అవి లాగేసింది.

ఆమె అద్దం అవీ తీసుకువెళుతూంటే, అతగాడు కూడా ఆమె వెంట వెళుతూ—

"పుష్పం! ఒక్కమాట. భగవత్సృష్టిలో అన్నివారాలూ ఒకటే అయినప్పుడు, ఈవారం మంచిది. ఆవారం చెడ్డది అనడం ధర్మంగా ఉందా? ఒకరోజు మంచిది, మరొకరోజు చెడ్డదీ అనడంలో సృష్టికర్తకు పక్షపాతం ఆరోపించడమేకదా!"

"పక్షపాతం భగవంతునికి లేదని ఎవరన్నారు?"

"ఆయనకూ్కడా పక్షపాతమే."

"అం తప్పక భక్తులన్నా, యోగులన్నా, సాధువులన్నా, అవతారపురుషులన్నా, మహాత్ములన్నా ఆయనకు పక్షపాతంకదూ! భక్తులను వెనకాల వేసుకొని భక్తులను బాధించే వాళ్లందర్నీ చంపడంలేదూ?"

"అవన్నీ పుక్కిటిపురాణాల్లోనికథలు. ముసలమ్మల కాలం ఊసుపోవడానికి చెప్పుకొనే కల్పితగాథలు. అవన్నీ

తర్క-విరుద్ధాలు. శాస్త్రసమ్మతాలుకావు. తాను సృజించిన ప్రజలనే తాను సంహరించాడంటే. భగవంతునికంటే దుష్టుడు మరొకడెవడుంటాడు? క్రూరుల క్రూరత్వాన్ని మన్నించి సహించుకోగలిగితేనే మానవులు మహాత్ములౌతారు. సహజ బుద్ధివల్లె, బుద్ధుడు, మహావీరుడు, క్రీస్తు, మహమ్మదు, లివోటజ్, చైతన్య, రామకృష్ణ, గాంధీ, జవహర్‌లాల్ మొదలైనవారు మహాత్ములయ్యారు. మరిమహాత్ములకు మహాత్ముడైన భగవానునకు ఎంతసమత్వం ఉండాలో నీవే ఆలోచించు. సృష్టిఅంతటా నిండియున్న భగవానుడు ఒక్క-భక్తులలో మాత్రమే ఉంటాడంటావా! భక్తులనుశిక్షించే దుష్టులలో మాత్రంలేడూ? దుష్టులను వధించడం అంటే తన్ను తాను వధించుకుంటం కాదూ!'

"మీరు చెప్పింది బాగానేఉంది. కాని ఒక్క-సంశయం..."

'అడుగు"

"అయితే—

'శ్లో॥ పరిత్రాణాయ సాధూనాం
వినాశాయ చ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి,యుగేయుగే"

అని భగవద్గీతలో పరమాత్ముడు చెప్పినట్లు, శిష్టులను రక్షించడానికి, దుష్టులను శిక్షించడానికి భగవంతుడు పుడతాడనడం అబద్ధం అంటారా!!

'మహాత్మాటికిని. భగవంతుడు పుట్టడం ఏమిటి? ఆయనకు జననమరణాలు లేవు. ఉంటే మనకూ ఆయనకూ భేదం ఏమిటి?"

"మరి రాముడూ, కృష్ణుడూ దేవుళ్లుకారా?"

'దేవుళ్లు- అనేపదమే తప్పు. ఉండే దేవుడు ఒకడే కాని ఇద్దరుకారు. భగవంతు డొక్కడే ప్రాణులు కోటానుకోట్లు రామకృష్ణాదులు భగవంతులుకారు, భగవదంశాసంభూతులు గాంధీగారన్నట్లు ప్రతిమానవుడూ భగవంతుని అవతారమే. కాని ఏమానవుడు, తన విధ్యుక్తధర్మాన్ని పాలిస్తాడో ఆమానవుని ఆకాలంవారు అవతారపురుషు డంటారు. అంటే తన మానవఅవతారాన్ని సార్థకం చేసుకున్నాడన్న మాట."

"బాగు. బాగు. అట్లేమాట్లాడితే కృష్ణభగవానుని వల్ల దుష్టులైన దుర్యోధనాధులు సంహరింప బడడంకూడా అబద్ధం అనేటట్లున్నారే."

"ఎందుకనను? గాంధీగారేమన్నారంటే- భగవద్గీతలో వర్ణించిన యుద్ధంఅంతా మన మనస్సులో నిత్యం జరిగేయుద్ధమే అన్నారు. అంటే మనలోని దుష్టభావాలకు, సత్యభావాలకు నిరంతరం జరిగే సంఘర్షణే, కురుపాండవుల యుద్ధం క్రిందవర్ణించారు. జయాన్ని సత్యానికే ఇచ్చారు.

"ఏమిటో మీావన్నీ వింతభావాలు"

'అలాగే అనిపిస్తుంది. తరతరాలనుంచి మనరక్తనాళాలలో ముద్రవేయబడిన ఈఆచారం, ఈమూఢవిశ్వాసం, ఈ

ఛాందసం ఒక్కనాటితో పోయేనా! ఈదురాచారాలన్నీ పోవాలంటే, ఈమూఢ విశ్వాసాన్ని కూకటివేళ్ళతో పెగిలించాలంటే ఎందరు గాంధీమహాత్ములు జన్మించాలో!"

'జన్మించాలి- కులభేదాలు తప్పని మాలమాదిగల్ని (బ్రాహ్మణులను కలిపి- ఒకేపంక్తి భోజనాలేర్పరచి, కులభ్రష్ఠతచేసి. దేశవినాసనానికి మార్గంచూపడానికి జన్మించాలి. ఇంతకూ కలికాలం దాపురించేనరికి అందరి భావాలూలాగే మారతాయిలెండి.

ఆమె కోపంతోను గదిలోకి వెళ్ళింది.

'మరినా—"

'చాల్లెండి...ఇప్పటికి సంపాదించు చాలు'

'మిగిలిన సగంచేసుకోనిస్తూ"

"రేపుచేసుకో వచ్చునులెండి'

"ఈఆకారంతో ఆఫీసుకు ఎలా వెళ్ళడం'

'మీకే తెలియాలి"

ఆమెమంగలిపొది పెట్టిలోపెట్టి వంటింట్లోకి వెళ్ళింది. అతడలాగే మండిపోతూ కూలబడిపోయాడు.



# iii

సుందరం కాలేజీ లెక్చరరు.

ఆరోజు సోమవారం దశరా సెలవల తరువాత ప్రారంభిస్తున్నారు. కళాశాలలో విద్యాప్రబోధం, ఆరోజు వెళ్ళక పోతే ఆపదిహేనురోజుల జీతం ఇయ్యరు. ఆరోజు వెళ్ళితీరాలి. సుందరం తనభార్యా పుష్పంతో అత్తవారింట్లో ఉన్నాడు. ఆ ఊరుకు బండి 7 గంటలకు ఉదయం వస్తుంది. ఆబండికి బయలుదేరితే కాలేజీకి వెళ్లవచ్చు.

సుందరం ఉదయాన్నే లేచి స్నానంచేసి బట్టలు వేసుకుంటూ ఉన్నాడు. పుష్పం కన్నబిడ్డకు పాలిచ్చి భర్త దగ్గరకు వెళ్ళింది.

'బలేబట్టలు వేస్తున్నారే. ఏమిటీ? ఉదయాన్నే కొత్త కొత్తగా తయారౌతున్నారే''

'పాతపడకుండా ఉండాలని'

'సరే. అమావాశ్యపూటా ఎక్కడికో బయలుదేరి వట్టుందే.'

"ఇంకెక్కడికి కాలేజీకి"

"చాల్లేండి. ఎక్కడైనా అమావాశ్యపూట బయలు దేరతారా?'

'కాలేజీవాళ్ళు పెడితే మనం ఏంచేస్తాను "

'హిందువులకు ఇది తగదని చెబుతాను'

'మాప్రిన్సిపాల్ హిందువుడై తేగా...'

"ఎంతమాలవాడై తే మాత్రం మన ఆచారాలనుమం టగలుపుకో మంటాడా?'

'అతడనేదేమిటి? అంతా అంటున్నారు"

'నాంట్లే ఊరుకోండి'

"పుష్పం. కాలేజీలో క్రైస్తవులూ ఉంటారు, హిందూ మహమ్మదీయులూ ఉంటారు. ఎవరిమతం వారిది: ఎవరి ఆచారం వారిది. శూన్యమాసంలో మనం వివాహాలు చెయ్యడం మదరాసులో మనవారే చేస్తారు. దేశకాలా లనుసరించే ఆచారవ్యవహారాలు మారతాయ్. ధర్మనిబంధనలు మారతాయ్—"

"అన్నీ మారతాయ్. మారందేమి?

'సత్యం."

'ఏమైనా కానీయండి. అమావాశ్య ప్రయాణానికి చాలా హానికరం."

"అని చెప్పిందెవరు?'

"శాస్త్రిలు."

'శాస్త్రిలెవరు చెప్పారు?"

"మహాత్ములు.'

"అంతేగా'

'అంతే'

"విష్ణుని సేవిస్తే ముక్తి వస్తుందని శాస్త్రాలు ఘోషిస్తున్నాయ్ అంటారు వైష్ణవులు. శివుని సేవిస్తే ముక్తి వస్తుందని శాస్త్రాలు ఘోషిస్తున్నాయ్ అంటారు శైవులు, మనం ఎవరి మాట వినాలి? ఏ శాస్త్రం పాటించాలి?'

"అన్ని శాస్త్రాలూ పాటించాలి."

'దానితో వెళ్తితప్పదు...లే...వెళ్ళాలి"

సుందరం బట్టలు వేసుకున్నాడు. భార్య ఎంత బ్రతిమాలినా వినకుండా అమావాశ్యనాడే బయలుదేరాడు. ఆమె పాపం ఏంచేస్తుంది? నీళ్ళునములుకుంటూ గుమ్మందగ్గిరకు వెళ్ళింది. వాళ్ళకు మామగారు వెంకటా్రవుగారు ఎదురు వచ్చాడు.

ఏవండీ వెడుతున్నారా?'

'అవును మావగారూ!'

"వెళ్ళవలసిందే?'

'తప్పుతుందా మరి?'

"అయితే ఒకనిమషం ఉండండి.'

'ఎందుకు?"

'చెబుతా...అమ్మాయి చెంబుతో నీళ్ళుపట్టుకొని అబ్బాయికి ఎదురార్రి?'

'తుమ్మి దీర్ఘాయుష్షూ అన్నట్లు మనమే మంచికకు నాలను నిర్ణించుకుంటం ఏమిటి?'

'బాగా చెప్పారు. అయితే ఉండండి. శకునం చూచి బయలు దేరవచ్చు.

'శకునం చూచి బయలు దేరడం ఏమిటండీ, దానంతట అది రావాలి కానీ.''

'రానపుడేంచేస్తాం!''

'వెళ్లిపోతాం.''

"ఇంకానయ్యాం ఉండండి.''

'బాగుంది. శకునం మంచిది కుదిరేలోపున నాటైయిను దాటుతుందనుకుంటా!''

"ఎంతమాట''

సుందరం మావ వెంకటావ్ ఆత్రుతతో వీధివంక చూస్తూఉన్నాడు. ఎంతకూ మంచిశకునం రాదు. ట్రయినుకు టయిమ్ అయిపోతూంది! వాచీవేపు స్తాన్ని చూచి మండిపోతున్నాడు సుందరం. సుందరం విరుద్ధభావాలుచూచి మండిపోతున్నారు వెంకటావు, ఘుహ్వాలు,

అలాఅంతా ఎదురుచూస్తున్నారు.

అంతలో అనుకోకుండానే ఒకపిల్లి అతనుముందునుంచి వెళ్ళిపోయింది. చూచాడు సుందరం. ఆనందం చెప్పలేం.

"మావగారూ? మంచిసెకునం వెళ్లనా ఇక"

'ఇంకానయ్యం! పిల్లికంటే పరమఛండాలపు సెకునం ఉంటుందా! అయితే అది ఎటువెళ్ళింది!''

"ఏటేమిటి! ముందునుంచే."

అదికాదు. కుడిగా వెళితే, ప్రాణగండం" ఎడమవేపు వెడితే బంధుగండం.

'మొత్తానికేదో ఒకగండం తప్పదంటారు?'

"తప్పితే శాస్త్రాలెందుకు?"

'ముందు వేసే అడుగు వెనక్కి వేయించడానికి ముందు చూచేనాప్పుడు కళ్ళాలువేసి వెనక్కి లాగడానికి.

ఇంకానయ్యాం. ఊరుకో. ఎవరైనా వింటారు,

'వింటే బాగుపడతారు."

వెంకట్రావుగారు అల్లుని మాటలు వినిపించుకోకుండా తోవవంక చూస్తున్నాడు. ఒక్కముత్తైయిదువూ నీటిబిందితో రాదేమిరా అని విసుక్కుంటూ ఉన్నాడు. అంతలో మంగలిపొద చంకలో పెట్టుకొని మంగలిఎదురయ్యాడు. దానితో అతని ఆగ్రహానికి అంతులేదు.

'బాబూ! లోపలకు పదండి.'

"ఎందుకండీ!'

"కాస్తకాళ్ళు కడుక్కొని, నోట్లోకొన్ని బియ్యపు గింజలన్నా వేసుకొని, కాసేపు కూర్చోండి'

'ఎందుకు?'

"మంగలిశకునంకంటే ముదష్టపుశకునం ఏముంటుం ఈశకునాన్ని పాటించకుండా ఇంటికి వెళితే ఇంకే మైనా ఉందా?'

"ఏమౌతుంది?"

ఏమహాపుత్రుండేమిటి? ఏళవమో ఎదురొచ్చి తీరాలని శాస్త్రం ఘోషిస్తుంటే ఊరక పదండి.

'రండీ—''

అటుమామ. ఇటు భార్య. ఏంమాట్లాడుతాడు. నోరు మూసుకొని లోపలకు వెళ్ళి వాళ్లు చెప్పినట్లల్లా చచ్చినట్లు చేశాడు.

వీధిగుమ్మం ఇంక లాభంలేదనుకొని దొడ్డిగుమ్మం పట్టారు శుభశకునాలకొరకు.

కొంతసేపయ్యేసరికి ఒక చాకలి అంటుకట్ట పట్టుకుని సుందరానికి ఎదురుగా వెళ్ళింది.

మామగారు "రామరామ'' అని కిందఉమ్మేసి 'ఇంకే ముందండీ - కొంపమునిగింది. మధ్యలో నెత్తురుకళ్ళచూశారే పాడుచాకలిముండ ఇప్పుడేరావాలి' అంటూ విసుక్కుంటు న్నాడు.

'మామగారూ! మీ శాస్త్రాలు నాకొంప ముంచేటట్లు న్నాయ్. టయిము దాటితే వచ్చేజీతం పోతుంది.''

'పోనిద్దు, వెధవజీతం. బ్రతికి బాగుంటే గడించుకో లేకపోతానుంట.''

'బాగానేఉందీ మూఢవిశ్వాసం.''

అంతా ఆత్రుతతో శుభశకునాని- ఎదురు చూస్తూ న్నారు.

అంతలో ఒక వెధవావిడ కాళీబిందెలో మడిబట్టలు పెట్టుకొని కాలువకు వెడుతూంది.

మానసగారి బాధ చెప్పడానికి వీలులేదు.

"సుందరంగారూ! చూచారా సెకునాలు. బయులు దేరిన వేళ మంచిదికాదు. ఇంక ప్రయాణం లాభంలేదు.

"ఊహూం'

సుందరానికి వాళ్ళయందు చెప్పలేనంత అసహ్యభావం ఏర్పడింది. అంతలో ట్రయినుశబ్దం వినబడింది. వినబడడంఏమిటి? ట్రయిను వెళ్ళిపోయింది. సుందరం అక్కడే కుర్చీలో కూలబడ్డాడు.

"బాబూ! సుందరం! ప్రయాణానికి మంచిచెడ్డలు పాటించాలి. తెలుకులోడు, నంటిబ్రాహ్మణుడు, కట్టెల మోపు, ఎదురురాకూడదు. వస్తే కీడుతప్పదు.

మనకేనా? ఎవ్వరికైనా సరేనా?

ఎవ్వరికైనా సరే.

అయితే మహమ్మదీయులు, క్రైస్తవులు వీటిని పాటించరుకదా, వారికే నష్టాలూ కనబడవే...? పాటించే మనకే ఇలా ఆర్థికంగా కూడా నష్టాలు కనబడుతున్నాయే. సెకునంలో శక్తి ఉంటే అందరికీ ఒకేవిధంగా అన్వయించాలికదా! దీనికేమంటారు?

ఏమంటాను? వాళ్ళకిప్పుడు నష్టాలు కనిపించకపోయినా తరువాతైనా నష్టాలు కనిపిస్తాయ్.

తరువాతంటే—?

వచ్చేజన్మలో—తప్పదండీ! శాస్త్రిలూరకే పోతారా?

వచ్చే జన్మలో కాకపోతే పయొచ్చేజన్మలో ఎప్పుడో ఒకప్పుడనుభవించ వలసిందే.

ఆఁ తప్పదు.

మామగారూ! మానవులంతా ఒకటేనా?

ఎలాగౌతారు? ఎన్నటికీకారు. పూర్వజన్మలో పుణ్యం చేసుకుంటే బ్రాహ్మణులై పుడతారు. పాపం చేసుకుంటే శూద్రులై పుడతారు. మరీపాపం చేసుకుంటే మహమ్మదీయులు, క్రైస్తవులై పుడతారు.

జన్మననుసరించి కులమా? గుణాన్ననుసరించి కులమా?

జన్మననుసరించే కులం.

చాలా పొరబడుతున్నారు.

శ్లో। చాతుర్వర్ణ్యం మయాసృష్టం
గుణకర్మ విభాగశః—

అని గీతలో చెప్పలేదూ? చాతుర్వర్ణ్యాన్ని సృష్టించిందినేనే. వారివారి గుణములు- చేసిన కర్మల ననుసరించి కులాలను సృష్టిస్తున్నానని కృష్ణుడు చెప్పలేదూ?

చెప్పాడు. ఎవరెవరి గుణాల ననుసరించి ఎవరెవరి కర్మల ననుసరించికులాలనుసృష్టిస్తున్నానన్నాడు. బాగానే ఉంది. అంటే ఎవరిపూర్వజన్మకర్మ ననుసరించి వాళ్ళను

బ్రాహ్మణులగానో, శూద్రులగానో సృష్టిస్తున్నానన్నాడో
ఇది కాదన్న వారెవరు!

అది కాదండీ, కులాలు గుణంవల్లే కాని, జన్మవల్లకా
దని అర్థం కావడంలేదూ!

అయితే నీవ్వూ గాంధీ గారిలా అన్ని కులాలూ ఒకటే
అంటావా!'

కాకపోతే వేరంటానా! మానవులంతా మాతృగర్భం
లో ఒక్కటిగాలేరూ! ఒక్కటిగా పుట్టలేదూ!

ఇలా అనుకోబట్టె దేశం ఇలా కరువుకాటకాల్లో తగ
లపడి పోతూంది.

ఇలా అనుకోబట్టికాదు; అనుకోకపోబట్టి.

బాగు బాగు.

మీమీ మనఃప్రవృత్తులనుబట్టి మీమీ మార్గాల
నేర్పరచుకున్నారు. మీకు తక్కువ కులంవారంటే చాలా
నీచాభిప్రాయం. వాళ్ళవలు మానవులకింద చూడ్డంలేదు.
కుక్కలకున్నా గౌరవంకూడా వీరియందులేదు. అందుకనే
చాకలిగాని, మంగలిగాని, ఎట్టివాడుగాని, తెలికలవాడుగాని
ఎదురొస్తే చెడ్డశకునం అనివాళ్ళముఖం చూడరు. అలాగేవిధ
వఎదురైతే ఆమె ముఖంచూడరాదని దుష్టశకునం కింద
భావించారు...మీలో తరతరాలుగా మూల్గుతూ ఉన్న కుళ్లు
భావాలవల్లే తోటిమానవులపై సోదరప్రేమ నశించింది. ద్వా

నితో జాతిమత కుల భేదాలు ఏర్పడి స్వతంత్రదేశాన్ని బా నిస దేశంగా చేశాయ్. మానవుడ్ని మానవుడినుంచి వేరు చేసే ఏదేశం అభ్యున్నతి చెందలేదు. ఏనాడో ఒకనాడుదానికి పతనం తప్పదు.

భగవద్గీతలో కృష్ణార్జున సంభాషణ ఒకసారి విమర్శన బుద్ధితో చూస్తే, శకునాల నెలా భగవానుడు ఖండించాడో తెలుస్తుంది.

ఎలా— చెప్పిచూస్తాను.

అర్జునుడుదుష్టశకునాలకుభయకంపితుడై ఇలాగన్నాడు.

"శ్లో॥ నిమిత్తానిచ పశ్యామి
విపరీతాని కేశవ !
న చ శ్రేయోను పశ్యామి
హత్వా స్వజనమాహవే॥'

కృష్ణా! మనకు వ్యతిరేకములైన చెడుశకునాలను చూ స్తున్నాను. యుద్ధంలో మనబంధువులను చంపడం శ్రేయస్కు గా కనుపించడంలేదు- అని చెప్పాడు.

దానికి కృష్ణుడిలాగన్నాడు.

'శ్లో॥ క్లైబ్యం మాస్మగమః,
పార్థ! నైతత్త్వయ్యుపపద్యతే;
క్షుద్రం, హృదయదౌర్బల్యం;
త్యక్త్వోత్తిష్ఠ పరంతప!'

"అర్జునా! శకునాలకు భయపడతావంటోయ్, వెర్రి బావా! ఇదంతావేమిటి? నీహృదయదౌర్బల్యంకదూ! హృదయదౌర్బల్యం ఎంతనీచం అనుకున్నావ్. శతృవులకు భయపడని నీకీహృదయదౌర్బల్యంఏమిటి? లే. దౌర్బల్యం విడిచివేయ్. కార్యరంగంలో మహాశూర్యునిలాగ దూకు భారతదేశగౌరవం కాపాడు. వీరు నాబంధుమిత్రులనే స్వార్థభావానికి సిజీపితాన్ని గురిచేయక...నిరంకుశపవ్రభుత్వాన్నుండి నీప్రజలను రక్షించుకో..." అంటూ శకునాలు పిరికిపందలకని చెప్పలేదూ?

ఒక్కమాటచెబుతావినండి ... పరిస్థితులు మనల్ని పాలిస్తాయా సామాన్యులం అవుతాం. పరిస్థితులను మనం పాలిస్తామా మహాత్ములం అవుతాం. మానవులెప్పుడూ విజ్ఞానశిఖరానికి ఎగబ్రాకి శిఖరం ముట్టడానికే చూడాలి కాని— శిఖరాన్నుంచి దిగబ్రాకి పాతాళం తొంగిచూడడానికి ప్రయత్నంచేయరాదు.

ప్రాణంమీద కొచ్చింది, త్వరగారావయ్యా అని వైద్యునిప్రార్థిస్తే—'ఉండు, మంచిశకునం రానియ్'—అని మడికట్టుకూర్చుంటే మంచంపట్టినవాడు మరణించక ఏం చేస్తాడో ఆలోచించండి.

మావగారూ! ఆత్మీయజ్ఞానం లేనప్పుడు తమనీడచూచుకొని తామే భయపడేమానవులు ఏర్పరచిన ఈమాయదారిశకునాలకు మనం శిరసులు వంచవలసిందే - - - మానవు

నిలో ఉండే మహత్తరశక్తులను ఈచిన్న చిన్న బంధాలచే బంధించ వచ్చునా చెప్పండి.'

మావగారేమీ మాట్లాడలేకపోయారు. అల్లుడు చెప్పే వినచ్చినా, పూర్వాచారాలకు విరుద్ధంగా నడవడానికి అతడు ఇష్టపడలేదు. దానితోటి 'సరే. పదండి, ఎవరిమతం వారిది. పుట్టెకుపుట్టినబుద్ధి పుడకలతోగాని పోదన్నారు. అంటూ లోపలకు వెళ్ళిపోయాడు.

భర్తగారుండిపోయారుకదా అనే ముసిముసి నవ్వులు నవ్వుతూ 'రండి' అనిపిలిచిందిగాని—పుష్పానికి అతని మనో వ్యధ ఏం తెలుసు.

అతడలాగే వేసవికాలంలో ఇంకిపోయిన చెరువులా నిలబడిపోయాడు.

అలా చూస్తున్నారు. రారే!

రాకేం చేస్తాను.

'వచ్చి—'

ఆఁ వచ్చి.

శాస్త్ర అబ్బాయిని ఎత్తుకుందురుగాని—

ఏనేముంది అబ్బాయిగారిని ఆడించడం ఆవిడగారిని లాలించడం- దానితో కడుపునిండిపోతుంది.

"ఎందుకండీ అంతకోపం'

మీవంటి అజ్ఞానుల ఇళ్ళల్లో పడితే కోపంకాక ఏ ముంటుంది!

అద్భుతమైన అనుభవం, పదండి. పదండి. చక్కని చిక్కని పాలుకాచి ఇస్తా-

ఆమె నవ్వుకుంటూ లోపలకు వెళ్ళింది?

“ఇది శాస్త్రమా? శనిగ్రహమా!’

అని అనుకుంటూ ఆమెతో లోపలకు వెళ్ళాడు సుందరం.

“యథామతా తథాపథా’ అన్నట్లు ఎవరిమనసును బట్టి వారిమార్గం ఉంటుంది.

---

## iv

ఫ్రెంచి లెక్చరర్ సుందరం మేడ.

తెల్లవారు జామునలేచి మేడపై అటూ ఇటూ పచార్లుచేస్తూ ఉన్నాడు. భార్యా అమాయకత్వానికి, ఆచారమూఢత్వానికి తనలో తాను బాధపడుతూ ఉన్నాడు. మాట్లాడితే ఉపవాసాలు; చన్నీళ్ళస్నానాలు; మడులూతడులూ; అపరాహ్ణభోజనాలు; పురాణ శ్రవణాలు; పూజలూ పునస్కారాలు; రేయింబవళ్ళూ భగవత్ చింతనలూ భక్తులకు స్వాగతాలు, ఇలా ఎన్నాళ్ళు?

రోజులు గడుస్తున్న కొద్దీ ఆరోగ్యం సన్నగిలుతూంది.

ఇలాగైతే ఆమెముకల గూటిలో హంస ఎంతకాలం కాపురం చేస్తుంది!'

అలా అనుకుంటూ బెంగతో వంగిపోయి- మనోవ్యాధికి లొంగిపోయాడు సుందరం.

ఏంచేస్తాడుపాపం!

ఆమెది పాతప్రపంచం; అతనిది కొత్తప్రపంచం. ఆమె చూపు వెనకటి శాస్త్రిలవైపు; ఇతనిచూపు ముందుశాస్త్రిలవైపు, తెరచాప దింపిన నావప్రయాణం ఆమె జీవితం; తెరచాప ఎత్తిన నావ ప్రయాణం అతనిజీవితం—



పుష్పానికినాలుగురోజులనుంచీ జ్వరం,ఆరోజు ముక్కోటిఏకాదశి. తెల్లవారు జామునే లేచింది. మంచం దిగింది. అది చూచాడు సుందరం. ఆశ్చర్యపోయాడు.

"పుష్పం!"

"ఆఁ!"

'అప్పుడే లేచావే!"

"... ... ..."

"నిద్రపట్టడం లేదూ!"

"లేదు."

"సరే. మందు తీసుకో."

గ్లాసులో మందేసి నోటికిఅందిచ్చాడు.

'పండుగపూటా, పరగడుపునా, పాసిముఖంతో మం దేమిటి?'

'పండగపూటా పరగడుపునా పాసిముఖాన్నుండగా ఈజబ్బేమిటి?'

"జబ్బులు వస్తాయ్; పోతాయ్."

పండుగలు రావ్వూ; పోవ్వూ; ఏం!'

'అబ్బా! నన్ను విసిగించకండీ.'

"అయితే మందు తీసుకోవా!'

"ఇంకానయ్యం! గంగముట్టందే.'

'గంగ ముట్టందే మందు ముట్టనంటావా!'

"తప్పక.'

"మందు తాగందే మంచినీళ్ళు తాకూడదు. పుణ్యం! జబ్బు చాలా ప్రమాదిస్తుంది!'

'ఏమీ ప్రమాదించదు. భగవంతుని దయుఉంటే కోటివ్యాధులూ ఒక్కక్షణంలో కూలిపోతాయ్."

'ఉహూం'

ఆమె మాట్లాడకుండా నెమ్మదిగా మేడమెట్లు దిగి పోయింది.

"నరనరాలకూ జీర్ణించుకుపోయిన ఈమాఢ్యం ఎప్పుడు పోతుందోకదా!" అనుకుంటూ మళ్ళీ పచార్లు ప్రారంభిం చాడు. ఏమీ తోచనపుడు చేసేది అంతేగా—

† † † †

ఒక అరగంట గడిచింది.

పనికుర్రాడు ఒక ఒంటెద్దుబండి అమ్మగారి ఆజ్ఞానుసారం తీసుకొచ్చాడు. సుందరానికి ఆమెపై చెప్పలేనంత కోపం వచ్చింది. కాని శివుడు కాలకూటం విషం మింగినట్లు దిగమింగుకున్నాడు.

బండిచూడగానే పుష్పం బయలుదేరింది. ఎక్కడికో పాపం సుందరానికి బోధపడలేదు.

'పుష్పం!'

'ఏం?'

'ఎక్కడకు?'

'కాలవకు.'

'ఎందుకు?'

'స్నానానికి.'

అతడాశ్చర్యపోయాడు.

పుష్పం! జ్వరంగా ఉంటే స్నానం ఏమిటి? జ్వరంలో స్నానంచేస్తే సంధించడం తప్పుతుందా?

సంధించడమూ తప్పకపోవచ్చు. మరణించడమూ తప్పకపోవచ్చు.

చేచేతులా మృత్యుమందిర ద్వారాలు తెరుచుకుంటే లాభం ఏముంది? రావలసిన మృత్యువు ఎలాగా వస్తుంది. మనం ఆహ్వానించడం ఎందుకు?

ఏమిటండీ మీ వెఱ్ఱి...చావు బ్రతుకులు మన చేతుల్లో ఉన్నాయా? ఉంటే మహారాజు పరీక్షితుడు తన ప్రాణాలని రక్షించుకో లేడూ? మందుమాకులు మనోధైర్యానికేగాని మరణాన్ని ఆపుతాయా? పైగా నాకేమంత జ్వరమని— శాస్త్ర వళ్ళు వేడిగా ఉంటేనే ఇంత కలవరపడాలా? అయినా ఎందుకండీ నామీద ఇంత వెఱ్ఱిప్రేమ! క్షణం విడిచి ఉంటే ప్రాణాలే కదలిపోతున్నట్లున్నాయే. నా కన్ను వెరుపెక్కితే చాలు; మీ గుండె బరువెక్కిపోతూంది. నా కన్నీటిచుక్క ఒక్కటి జారి తేసరి; మీకది కాలసముద్రంలా కనబడుతూంది. నావళ్లు వేడిగా ఉంటేచాలు; మీకీ ప్రపంచమే అగ్నిపర్వతం అయిపోతుంది...ఏమిటీ వెఱ్ఱిప్రేమ...

హుమ్మం! సతిని గుండెలోతుల్లో దాచుకుంటం పతి తప్పా? సతి జీవనమాధుర్యాన్ని సేవించడం పతి తప్పా? నిజానికి భగవంతుడు ప్రేమమయుడైనప్పుడు, సతీ పతులొకే మనసుతో ప్రేమపూజ చేయడంకంటే వాంఛనీయం ఏముంటుంది? ప్రేమే దైవం; దైవమే ప్రేమ. సతే పతి జీవన మాధుర్య రసప్రవాహం.

పతే సతి జీవితానంద చంద్రికా ప్రసారం. కాదని ఎవరన్నారండీ! సతీపతుల భావాలు ఒకే శ్రుతిలో ఆలాపన చేస్తే కావలసిందేముంది? సంసారం స్వర్గమే.

మరి . . .

అలాగని . . .

స్నానం మానతానా అంటావ్? అంతేనా?

ఈ మూర్ఖరాలను ఇలా బ్రతకనీయండి. మహాపర్వ దినంలో కూడా స్నానం చెయ్యందే ఎలా పూజ చేసుకోగలం? అందులో ఇవాళ సామాన్యమైన రోజా? ముక్కోటి ఏకాదశి. ముక్కోటి దేవతలు ప్రతి తీర్థంలోనూ దీవిస్తూఉంటారు. అందులో లాకులుదాటాక అటు గోదావరి, ఇటు కృష్ణా కలుస్తుంది. గోదావరీ కృష్ణా సంగమనంలో స్నానంచేసే దానికంటే ముక్తి ఏముందండీ? గోదావరి అంటే మాల్లా దక్షిణగంగ.. ఈ వెధవశరీరం ఏనాడో ఒకనాడు ఈనేలపై వాల్చి—అంతుపంతులేని ఏ అగాధ కాల సముద్రంలోనో కలిసిపోతాం.

అయితే.

చావుతప్పని ఈ శరీరాన్ని ఎప్పుడూ సుఖపెట్టడానికి ప్రయత్నం చేయకూడదు? గట్టిగా ఒకసారి కళ్లుమూసేలోగా పుణ్యం సంపాదించుకోవాలి. మనతో వచ్చేవి మన పుణ్య పాపాలే; సుఖ దుఃఖాలుకావు. అనుభవించవలసింది ఆనందం సుఖంకాదు. భయపడవలసింది పాపానికి, మరణానికి కాదు.

- పుష్పం! పుణ్యం పురుషార్థం అన్నారు; ఒప్పుకుంటా. పుణ్యం చెయ్యాలి, తప్పదు. భయపడవలసింది పాపానికే, మరణానికి కాదు. అదీ కాదనను. కాని ఏ మార్గంలో నడిస్తే పుణ్యం వస్తుందను కుంటున్నావో—ఆ మార్గం మాత్రం తప్పని భావిస్తున్నాను. ఎందుకంటే-ముక్కోటినాడు గంగలో మునిగి

తేనే మోక్షంవస్తే ఎన్ని చేపలు మునిగి తేలడంలేదూ? ఎన్ని కూరగాయల సర్వాలు మునిగి తేలడంలేదూ? ఎన్ని జీవరాసులు మునిగి తేలడంలేదు వాటన్నిటికీ మోక్షంవస్తుందంటావా? మునిగినప్పుడల్లా మూటెడు పుణ్యం మోసుకుపోతున్నాయంటావా?

ఏమో!

పిచ్చిపిల్లా! మార్గం తప్పావ్.

ఏమార్గం అయితేనేమండీ-చేరవలసిన గమ్యం ఒక్కటే. అన్ని మార్గాలూ ఆ గమ్యానికే తీసుకుపోతాయ్.

"మార్గం తప్పితే ప్రమాద ఎక్కువ."

కానీయండీ. మైలు రాయిలా కదలకుండా ఉంటే తప్పుగాని, ప్రయాణం సాగిస్తున్నప్పుడు తప్పేముంది— ప్రయాణం సాగించాలేకాని ఇవాళ కాకపోతే రేపైనా చేరుకుంటాం ముక్తిమందిరం. మాది వంకరమార్గంఅంటారా! కొంచం ఆలశ్యంగా చేరుకుంటాం. మీది తిన్నని మార్గము అంటారా మాకంటే ముందే చేరుకుంటారు. అంతేగాముందు వెనుకలు.

"రైలుండగా రెండెద్దుల బండెందులకు!"

ప్రమాదం తక్కువకాబట్టి.

ఊహూఁ!

ఆమెమాట్లాడకుండా గదిలోకి వెళ్ళి పట్టుకోక తీసుకొని బయలు దేరింది.

పుష్పం! స్నానం చెయ్యడం తప్పదా!

క్షమించండి.

చాలా ప్రమాదం సుమా!

భగవత్ కృప.

ఆమె వెళ్ళిపోయింది.

అతడలాగే నిలబడిపోయాడు.

† † † †

పుష్పం స్నానంచేసి, తలైనా ఆరుపుకోకుండా దేవునికి కొబ్బరికాయలిచ్చి, ఇంటికి జేరింది. అంతే స్పృహ తప్పి పడిపోయింది. వెంటనే మంచంమీద పడుకోబెట్టాడు— భద్రం సుందరం.

శరీరం అగ్నిగుండాల మండిపోతూంది. అతనికి మరీ పోతూపోతూందిహృదయం ఆగిపోతుందేమో. నిప్పంతి బరువుగాఉంది.

ఆమె స్థితిచూచి అతనికి భయంవేసింది—

'పుష్పం! పుష్పం'' అని నెమ్మదిగా, జాలిగా పిలిచాడు. పుష్పం మాటాడలేదు. కన్ను తెరువలేదు.

ఆమె పిల్లలిద్దరూ అమ్మా! అమ్మా! అంటూ తల్లిమీదపడి ఏడ్వడం ప్రారంభించారు. దానితో అతని కడుపు తరుక్కుపోయింది.

భార్యకొరకు డాక్టర్ దగ్గరకే వెడతాడా! పిల్లలకొరకు ఇంటిదగ్గరే ఉంటాడా! అతనికేమీ తోచలేదు. ముందు

నుయ్యి; వెనుక గొయ్యి. తనచుట్టూ చీకటి పొగలు పొగ లుగా కమ్మినట్లయింది. అలాగే గొయ్యబారి పోతున్నాడు.

పిల్లలు తనదగ్గర కొచ్చా—"నాన్నా! అమ్మోఅమ్మో" అంటూ చొక్కాపట్టుకొని ఏడ్వడం ప్రారంభించారు. ఆదృశ్యంతో అతనిలోని ప్రతిరక్తనాళం కరిగి పోయింది. పొంగి పొర్లివచ్చే దుఃఖాన్ని దిగమింగుకోలేక, పిల్లల్ని దగ్గర తీసుకొని "భయ పడకండి. మీఅమ్మకొచ్చిన భయమే మీా లేదు.' అంటూ వారి తలలను తనకన్నీళ్ళతో తడిపాడు.

పుష్పం ముఖంవంక చూచాడు. ఆమె ముఖంలో కళ తప్పిపోతూంది. అతని హృదయంలో ప్రళయ ఝంఝూప్రభంజనాలు హోరుహోరుమని ఏడుస్తూన్నాయ్.

ఆపిల్లల ఏడుపులన్నీ విని ఏమిటా ఇది అని ఆపక్కింటి రావమ్మ వచ్చింది.

"అన్నయ్యా! ఏమిటీగొడవ?"

"ఇంకేముంది రామం! మీాపుష్పంకొంపముంచేసింది."

"ఏంచేసింది?"

'జ్వరంలో స్నానం."

'ఇంకేముంది! వెంటనే వళ్లుచల్లబడిపోతుందేమో!

తక్షణం డాక్టర్ని పిలుచుకురండి. నేను చూస్తూఉంటా'

'అలాగే. అలాగే.

అతడు గడగడ లాడుతూ డాక్టర్ దగ్గరకు బయలు దేరాడు.

† † † †

డాక్టర్ని ఆత్రుతతో తీసుకువచ్చాడు.

పుష్పం మంచంమీద లేదు.

'పుష్పం'' అని కేక వేశాడు.

"ఊం'' అనే మూల్గు వినబడింది వక్కగదిలోనుంచి—

అక్కడకు వెళ్ళి చూస్తే ఆమె చాపమీద పండుకుంది. రామం కన్నీళ్లు కారుస్తూ పుష్పం తల దగ్గర కూర్చుంది.

రామం! పుష్పాన్ని ఇలా ఎవరు పండుకోబెట్టారు?

ఎవరు పండుకోబెడతారన్నయ్యా! ఆమే పండుకుంది.

ఏంచేత?

ఏకాదశీ ఉపవాసంతో ఉండి మంచంమీద పండుకో కూడదంట.

ఎన్నివిధాల చంపాలనుకుంటుందో అన్ని విధాలా చంపుతూంది ఈ శాస్త్రం పేరుచెప్పి. ఇది శాస్త్రం కాదు; శనిగ్రహం.

సుందరం వినుకుంటూ బయటకు వెళ్ళి డాక్టరుగారిని లోపలకు తీసుకువెళ్ళాడు.

వెల్. మిస్టర్ సుందరం! ఒక్కమాట చెబుతావినండి. జ్వరంతో ఉండగా చన్నీళ్ళ స్నానం చెయ్యడం, వళ్లు చల్ల

బడ్డాక నేలమీద పండుకోవడం, ఇవన్నీ చాలా మూర్ఖ లక్షణాలు.

కాదని ఎవరన్నారండీ.

అయితే ఆమెను మొట్టమొదట మంచంమీద పండుకోబెట్టి రగ్గు కప్పండి.

అలాగే.

అతడామె దగ్గరకు వెళ్ళాడు. ఆమె కన్నులు తెరిచి చూచింది.

ప్రుష్నం!

ఎందుకండీ ఈ హడావుడి.

డాక్టర్‌గారు మంచంమీద పండుకోమన్నారు.

మా డాక్టర్‌గారు నేలమీద పండుకోమన్నారు.

మీ డాక్టర్ గారెవరు?

శ్రీకృష్ణపరమాత్మ.

అదేమిటి?

వైద్యో నారాయణహరిః- అనలేదూ! ఆ నారాయణుడే వైద్యుడు.

అయితే మందు?

తులసి తీర్థం.

అయితే ఈ డాక్టరుగారి మందు తీసుకోవా?

ప్రాణం పోతే తీసుకోను!

నా మాట వినవా?

ఈ విషయంలో మాత్రం మన్నించాలి' అన్యథా భావించకండి. నా వెఱ్ఱి నాకు విడిచిపెట్టండి. నాకు వైద్యుడా భగవంతుడే. మందు ఆ తులసి తీర్థమే.

సుందరం ఏమీ మాట్లాడలేదు.

తలపట్టుకొని కూర్చున్నాడు.

అతని అవస్థ అంతా చూసిన డాక్టరు మాట్లాడకుండా దాటిపోయాడు.



భగవంతుడా! జబ్బుకు మందుందికాని మౌఢ్యానికి మందులేదు. తనకు తోచదు; ఇతరులు చెబితే వినదు. ఏం చెయ్యాలి. అడుగుతీసి అడుగువేస్తే శాస్త్రం అంటుంది. యదార్థానికి శాస్త్రం మనిషి చేసిందో, మనిషి శాస్త్రాన్ని చేశాడో తెలీదు..." అనుకుంటూ పోస్టాఫీసుకు వెళ్ళి మావగారిని తక్షణం బయలుదేరమని, భార్యకి ప్రాణంమీద కొచ్చిందనీ వైరిచ్చాడు.

మావగారు వెంకట్రావ్ గారు గుండె బాదుకుంటూ చక్కావచ్చారు.

అమ్మాయి కెలాగుంది?

చూడండి.

లోపలకు వెళ్ళి చూచి వచ్చాడు.

ప్రమాదంగానే ఉంది.

కాస్త కాఫీ అన్నా, జావన్నా పట్టించండి.

ఉపవాస ఫలితం పోదూ!

బ్రతికుంటే మరోకసారి ఆ ఫలితాన్ని పొందొచ్చు కదండీ!

అలాగంటే ఎలా?

పోనీ కాస్త మందైనా పొయ్యండి.

పండగపూటా మందెలా పట్టించనా అని ఆలోచిస్తున్నాను.

ఇలా ప్రాణంపోయేవరకూ ఆలోచిస్తూనే ఉంటారనుకుంటా.

వెళ్ళొస్తా.

వెంకట్రామ్ గారు లోపలకు వెళ్ళాడు. మళ్ళీ తిరిగి రాలేదు.

సుందరంమాత్రం బయటనుంచి కదలలేదు.

◆ ◆ ◆ ◆

పగలెలాగో గడిచిపోయింది. ప్రాణం పోలేదు. నీరసంగా ఉన్నా పుష్పం కళ్ళు జ్యోతుల్లా వెలిగి పోతూనే ఉన్నాయ్.

రాత్రి ఎనిమిది గంటలయింది. పుష్పానికి ఎక్కడలేని శక్తివచ్చింది. లేచి కూర్చుంది. భర్తను పిలిచింది. సుందరం దగ్గరగా కూర్చున్నాడు.

మీ భయం తగ్గిందా?

తగ్గింది.

భగవంతుడు మన పాలిట ఉన్నాడని చెప్పలేదూ?

చెప్పావ్. భగవంతుడు మన పాలిటే కాదు; సృష్టిలో ప్రతి పిపీలిక పాలిటా ఉన్నాడు. అభాగినుల అశ్రుబిందువులోనే ఆలయం కట్టుకొని ఉన్నాడు.

మరి భయం ఎందుకు?

పిరికితనం చేత. స్వార్థం చేత. అభిమానం చేత. ఆరిపోని అనురాగం చేత.

మీ మనసంతా మారినట్లుందే.

మారుతూ మారుతూంది.

నామీద కోపమా?

కాదు; జాలి.

ఆమె ఒక నిట్టూర్పు విడిచింది. ఇద్దరూ ఏమీ మాట్లాడుకోలేదు. అలా కొంత సేపు గడిచింది.

ఇవాళ బవర్ దాసుగారి హరికథ ఉందటండూ!

తెలీదు; ఉంటే ఉండొచ్చు.

అక్కడకు వెళ్ళాలని ఉందండి.

అయితే వెళ్ళు. నీవు వెళ్ళదలచుకుంటే నూన్పించడానికి బ్రహ్మాంతరం కాదుగా. ఇసుకనుంచైనా తైలం తీయొచ్చునుగాని, నీ స్వార్థం మార్చలేంకదూ!

మీకు కష్టంగా ఉంటుందా?

తప్పక.

ఎందుకు?

నా మాట విననందుకు.

మన భావాలు వేరైనప్పుడు ఎవరి మార్గాన్ని అనుస రించి వారు నడుచుకుంటం మంచిదికదూ!

మంచిదే.

మన భావాలు వేరుకావచ్చు; హృదయాలు వేరు కావలసిన పనేముంది?

ఉంది.

ఎలా?

పుష్పం! ఏనాడు మన భావాలు వేరౌతాయో, ఆ నాడే మన హృదయాలు వేరౌతాయ్. నీ భావాలను విడిచి నీవు లేవు. నిన్ను ప్రేమిస్తున్నానంటే నీ భావాలను ప్రేమిస్తున్నా నన్న మాట. "Man is the bundle of ideas" అన్నాడొక ఆంగ్ల కవి. అంటే భావాల సంపుటీకరణమే మానవుడని భావం... "నీ భావాలు నాకు నచ్చవు; కాని నిన్ను ప్రేమి స్తున్నాను" అంటారు కొందరు. అది చాలా పొరపాటు. ఏనాడు నీ భావాలు నాకూ, నా భావాలూ నీకూ నచ్చవో, ఆనాడే మనం ఈ ప్రేమ రాజ్యంలో దూరం అయిపోతాం. భావాలు వేరుకాగానే మార్గాలు వేరైపోతాయ్. తప్పదు. ఒకరి నొక

రం ద్వేషించుకోపోవచ్చు, కాని ప్రేమించుకోలేం. మనః ప్రవృత్తి తెలిస్తే దీని యాదార్థ్యం తెలుస్తుంది.

ఒక్క విషయం చెబుతా విను పుష్పం! నాకు ఖద్దరు కట్టాలని పరితం అనుకో; నీకు గ్లాసుకో కట్టడం ఇష్టం అనుకో; దానితో మన దృక్పథాలు మారిపోతాయ్. ఎలాగంటే గ్లాసుకో బట్టలే కాదు, ఏ విదేశీయ బట్టకట్టిన వ్యక్తి అయినా నాకు శవంలా కనిపిస్తాడు. అతని శరీరంమీదున్నా తెల్లని గ్లాసుకో ఎలాగుంటుంది. చచ్చిన శవంమీద కప్పిన సైనుగుడ్డ లాగుంటుంది...

ముదక ఖద్దరు కట్టిన మేం నీకెలా కనబడతామంటే గోనుగుడ్డలు కట్టుకొన్న పిచ్చివాళ్ళల్లా కనబడతాం.

ఇలా భావించడం ఎవరితప్పూ అనను. ఎవరి మనసును బట్టి వారి మార్గం...

బాగా చెప్పారు. అయితే మన భావాలు వేరైనా మిమ్మల్ని ప్రేమించగలుగుతున్నానే.

'ప్రేమిస్తున్నానని అనుకుంటున్నావ్. కేవలం పొర పాటు. నన్నే ప్రేమిస్తుంటే నామాట వినకుండా ఉండలేవ్— ప్రేమలో 'నీ' 'నా' భేదాలుండవ్ పుష్పం! తాదాత్మ్యం ఉంటుంది. అంటే ఇద్దరి భావాలూ ఒక్కటైపోదాయ్. ఇద్దరి జీవితాలూ ఒకే శృతికి ముడివడి పోతాయ్?

పుష్ప ఆలోచనల్లో పడింది. ఆమె హృదయం బరువెక్కిపోయింది. దానితో కన్నులు తేమగిల్లాయి.

'పుష్పం! సంసారం స్వర్గం కావాలంటే భార్యాభర్తలు ఒకే మార్గంలో నడవాలి. ఒకరు చెప్పింది మరొకరు చేయడంలో సరదాపడాలి. భార్యకు ఆనందం కలిగించడానికి భర్త, భర్తకు ఆనందం కలిగించడానికి భార్య ప్రయత్నం చెయ్యాలి. ఒకరి కొకరు లెక్కచెయ్యాలి గాని సృష్టికి లెక్కచేయరాదు.

అలాగే. నాదీ పొరపాటుగా కనిపిస్తూంది.

పుష్పం! భర్త ద్వారా భగవంతుని చూడగలగాలి. భర్త చిరునవ్వు అనే నావలో ప్రయాణం చేసి భగవానుని ముక్తిమందిరం చేరుకోవాలి. భక్తి లేనిదే అనురక్తి లేదు. అనురక్తి లేనిదే ముక్తి లేదు ముక్తి పొందటానికి మొదటి మెట్టు రక్తి.

పుష్పం! ఇంతగా హృదయంలో దాచుకొన్న నన్నే ప్రేమించలేని నీవు భగవానునెలా ప్రేమించగలవో చెప్పు.

పుష్పం! ఆ గుడిలో ఉన్న భగవానుడు నాలో లేడంటావా? కదిలే ఈ దేవాలయంలో ఉన్న దేవుని చూడలేని నీవు— కదలని దేవాలయంలో ఉన్న రాతి బొమ్మలో దేవుని ఎలా చూడగలవు.

"మనిషి చేసిన రాయి రప్పకు
మహిమ కలదని సాగి మొక్కుతు

మానుషులుంటే మాయురవ్వల
కన్న కనిష్ఠం—
కన్ను తెరచిన కానబడడో?
మనిషి మాత్రుని యందు లేడో?
ఎరిగి కోరిన కరిగి యీడో
ముక్తి——'

అన్నా మహాకవి గురజాడ అప్పారావుగారు ప్రబోధం భావించు—

“ఏకం సత్
విప్రా బహుధా వదన్తి”
—ఋగ్వేదం.

“ఉన్నా భగవంతుడొక్కడే. పండితులు అనేకవిధాల అతన్ని భావిస్తున్నారు’ అని ఋగ్వేదంలో చెప్పలేదూ?

సత్యం! గోపికలు కృష్ణునిలో భగవత్ స్వరూపాన్ని చూడగలిగారు. సీత రామునిలో దైవత్వాన్ని చూడగలిగింది. పార్వతి పరమేశ్వరునిలో అద్వైతరూపాన్ని చూడగలిగింది. సావిత్రి సత్యవంతునిలో పరమాత్మ స్వరూపాన్ని భావించగలిగింది దమయంతి నలునిలో పరమాత్ముని దర్శించగలిగింది. అలా పౌరాణిక చారిత్రిక యుగాల్లో స్త్రీలు తమభర్తలలోనే భగవత్ స్వరూపాలాగాంచి తరించారు. నేటియుగంలో రామకృష్ణ పరమహంసల్లో అద్వితీయ తేజస్సునుగాంచిపూజించి శా

రదాదేవి తరించింది. గాంధిజీలో పరమాత్ముని మునకి భావించి కస్తూరిబా తరించింది—ఇలా ఎందరో—

భర్తలలో పరమాత్ముని స్వరూపాలు భావించి భారత స్త్రీలు తరించారంటున్నారు. ఒప్పుకుంటాను. రాయిరప్పల్లోనూ, చెట్టుపుట్టలలోనూ దేవుని చూడగలిగిన భారతస్త్రీలు—తమతమ భర్తల హృదయదేవాలయాలలో భగవానుని చూడగలుగడం ఆశ్చర్యంకాదు. కాని—

"ఉండు. అడుగు.'

కోపం రాదుకదా!

ఎందుకోపం?

అన్యథా భావించరు కదా!'

'ఛా. ఛా.'

భర్తలలో భగవానునిచూచి భార్యలు తరించగలిగి నప్పుడు, భార్యలలో భగవానునిచూచి భర్తలుమాత్రం ఎందుకు తరించరాదు?

"తరించవచ్చు. తరించారు. పార్వతిని అర్థాంగిగా చేసుకొని పరమేశ్వరుడు తరించాడు. లక్ష్మిని తనహృదయాధిదేవతగా చేసుకొని విష్ణుమూర్తి ధన్యత్వం చెందాడు. సరస్వతిని ముఖస్థం చేసుకొని బ్రహ్మ పవిత్రత చెందాడు— అలాగే అంతా చేయాలి.'

"అహా!"

'పుష్పం! స్త్రీని పురుషుడు తక్కువగా చూస్తున్నా డని నీభావం. పొరపాటుసుమా. సహృదయుడు, రసికుడు, శ్రీమోపాసకుడైన పతి ఎప్పుడూ సతిని తక్కువగా చూడ లేడు—

అసలు స్త్రీకున్నా ప్రాధాన్యం సంఘంలో పురుషు నకు లేదు. పేర్లదగ్గరనుంచీచూడు— లక్ష్మీనారాయణులు; సీతారాములు; పార్వతీ పరమేశ్వరులు; శారదా బ్రహ్మలు కస్తూరిబాగాంధీలుఅని స్త్రీమూర్తికే గౌరవం ఇచ్చారుకదా. ఇక యజ్ఞయాగాదుల్లో సతిలేనిపతి పూజా పీఠంమీద ఉండ రాదుకదా! తుదకు దైనందినక పూజా చర్యలలోకూడా, మాతృదేవోభవా" పితృదేవోభవఅని మాతృదేవికే ప్రథమస్థానము ఇచ్చారుకదా!

తుదకు మనండుండే దేశానికి "మాతృదేశం' అంటు న్నారేకాని జర్మనీ రష్యాలవలె "పితృదేశం" అనడంలేదు కదా—

దేశం మాత్రమే కాదు— మాటాడే భాషను ఏమం టున్నారు? 'మాతృభాష' అనడంలేదా?

ఇలా మాతృదేవత, మాతృభూమి, మాతృభాష అని మాతృదేవతకే ఆధిక్యంఇచ్చారుకదా! అంతవరకూ ఎందుకు 'తల్లీపిల్లా' అంటారేకాని "తండ్రీపిల్లా' అనడంలేదుకదా!

ఏమంటావ్?

శభాష్ అంటాను.

ఇంకా విను.

చెప్పండి.

రవీంద్ర కవీంద్రులు చెప్పినట్లు భగవత్ సృష్టి అంతా స్త్రీసౌందర్య ప్రతిపాదనకేమో అన్నట్లుంది.

అదేలా?

చూడు— ఆతోటలో పూలన్నీ ఎవరికోసం మీకీలు జడలో అలంకరింప బడడానికి కాదూ! సముద్రుడు తరతరాలుగా తన గర్భంలో దాచుకొన్న రత్నాలు, తరంగహస్తాల తో అందించేది మీ కేకదూ? మీఅమృతగళసీమనలంకరించమనేకదూ? గనులలోని బంగారాన్ని కరిగించిచేసిన ఆభరణాలన్నీ ఎందుకు? మిమ్మల్ని అలంకరించడానికికదూ! ఈ నగలూ నాణాలూ, రత్నాలూ వజ్రాలూ, బట్టలూ పాతలూ, ఈసిరీ సంపదా అంతా మీకొరకుకాదు.

బలేగా చెబుతున్నారండీ!

పుప్పం! మూడువందలరూపాయిల కోక సతికికొన్నా పతి, తనకై ముప్ఫయిరూపాయిలుపైన ఏనాడైనా ఒక పంచి కొనుక్కోగలిగాడా? వేలకువేల రూపాయిలు వెచ్చించి సతికి ఆభరణాలు చేయించే పతి, తనకై ఎప్పుడైనా ఒక వెయ్యి రూపాయిలు వెచ్చించి నగలు చేయించుకున్నాడా?

"లేదు."

అలంకార శోభితమైన సతిని చూడడం పతిసరదా సతి సౌందర్యంలోనే పతి తన ఆనంద సౌధాన్ని నిర్మించుకుం

టాడు. భగవానుని అలంకరించినట్లుగా అలంకరిస్తాడు; సేవి స్తాడు; పూజిస్తాడు; తరిస్తాడు. ఒప్పుకుంటావా!

ఇంకానా?

పుష్పం! లే! నామాట విను. కొంచం కాఫీ తీసుకో విశ్రాంతి తీసుకో. నిదరపో. ఆరోగ్యం చక్కబడుతుంది పిల్లలు హాయిగా నిదరపోతారు. నాకళ్లు చల్లగా నిదటలో మూతలు పడతాయ్. ఇంతమందిని కష్టపెట్టి పుణ్యం ఆర్జిం చాలంటావా! ఆలోజించు.

అనను.

మరిలే.

ఆమె ఆలోచనల్లో పడింది. ఒకవైపు పతిభక్తి, రెం డోవైపు భగవత్ భక్తి. ఏమిచేయడం అని ఆలోచించింది. సుందరం చెప్పినట్లు భర్తృసేవే భగవత్ సేవ అని గ్రహిం చింది. భర్తఏది చెబుతే అది చెయ్యాలని నిశ్చయించుకొంది. ఆమె కన్నులలో ఆనంద సుధారేఖలు వెలార్చాయ్. అది చూచి ఆమె హృదయం గ్రహించాడు సుందరం.

దేవరవారి మాట లికనుంచీ దేవిగారు వింటారను కుంటా—

తప్పక.

మతం మార్చారా?

తమ అభిమతానుసారము అనుసరించే మతాన్నే ఆచరిస్తా—

ధన్యురాల వయ్యావ్.

అవును. పతిహృదయాను గుణంగా నడుచుకోని సతి కంటే భూలోక రాక్షసి లేరని గ్రహించా. సతీపతులొక టైతే ఇల్లు స్వర్గం అవుతుంది; లేకపోతే నరకం అవుతుందని తెలిసికున్నా, అభ్యుదయం నాలో వికసించింది. నిర్మలత్వం నాలో నెలకొల్పబడింది. స్వచ్ఛంద జీవనానికి నాహృదయం ముందడుగు వేస్తూంది. మీరు నాకు చేయూత నివ్వండి. నా తప్పులు మన్నించండి. అని పతిహృదయంపై వాలిపోయి వెక్కి వెక్కి ఏడుస్తుంది.

ఆమె వేడి కన్నీళ్ళు తన చేతులతో తుడుస్తూ, ఆమె తన మార్గానికి వచ్చినందుకు ఆనంద పరవశుడయ్యాడు సుందరం. నిజానికి సతీపతులొకటైననాడు సంసారం మధురాతి మధురం కదూ—?

## V

ఏపనిఅయినా చెప్పి చేయించుకుంటంలో గొప్పతనం లేదు. చెప్పకుండా చేయించుకోవాలి.

సుందరం హృదయం తెలుసుకొని అతడేమీ చెప్పక ముందే అతడి పనులన్నీ చేస్తూంది పుష్పం. అలాగే పుష్పం హృదయం తెలిసికొని ప్రతిపనీ చేస్తున్నాడు సుందరం—వారి ఆనందం చెప్పడానికి వీలులేదు.

♦ ♦ ♦ ♦

కొన్నాళ్ళు గడిచాయ్.

ఆరోజు శ్రావణ శుక్రవారం.

ఉదయాన్నే లేచి లక్ష్మీపూజ చేస్తూంది పుష్పం. అతడు నవ్వుతూ ఆమె పక్కన నిలబడ్డాడు.

ఏం నవ్వుతున్నారు?

లక్ష్మీదేవిని ఏమి ఇమ్మంటున్నావ్?

లక్ష్మిని.

ఏమిటీ! రెండు కొబ్బరికాయిలిచ్చి వేలకువేలు గుంజాలనుకుంటున్నావన్నమాట.

అందరిలాగే నేనూను.

అయితే నీలో గొప్పతనం ఏముంది? అందరికంటే ఒక అడుగు ముందువెయ్యాలి. ఒకరిని నడిపించాలి; ఒకరిచే నడిపింపబడ రాదు.

అంత శక్తికూడానా?

అలా అనుకోకు. మనలో ఉన్న అద్వితీయ శక్తి మనకు తెలీదు. ముసుగుతీయ్. నీలో శక్తి నీకు తెలుస్తుంది. నీవు చేయలేని దేముందసలు? ఇలారా చెబుతా.

అతడామె చెయ్యి పట్టుకోబోయాడు.

ఆమె ఆశ్చర్యపోయింది.

ముట్టుకుంటారేమిటండీ?

ముట్టుకోరాదూ?

మడి కట్టుకున్నా; కనబడ్డం లేదూ?

మడా!

అతడు విరగబడి నవ్వడం ప్రారంభించాడు.

ఏం నవ్వుతున్నారు?

మడి తలుచుకుంటుంటే నవ్వు ఆగడంలేదు.

ఏం తప్పా?

తప్పా, తప్పున్నరా? శుభ్రతకోసం మడి పెట్టేరేకాని ముట్టుకుంటే మైలపడతారని కాదు. పెద్దలు చెప్పిన శాస్త్రాల నర్థంచేసుకోపోతే వచ్చే అనర్థమేఇది.

అంతకంతకు ఈ పూజానమస్కారాలు, ఈ విగ్రహా రాధన, అంతా తప్పనేటట్లున్నారు.

తప్పనను. కాని అంతకంటే ఉన్నతమార్గం ఉందం టున్నాను.

అదేమిటి?

పుష్పం! విగ్రహారాధనతో మానవ జీవితం ఆగిపో రాదు. ఆమెట్టు దాటాలి. ఆరాధనకు అద్వైతం కల్పించాలి. అంటే.

విగ్రహారాధన విడిచి, మానవారాధన ప్రారంభించాలి. జాతి కుల మత భేదాలు పాటించకుండా ప్రతి మానవునిలోని దైవత్వాన్ని ఆరాధించాలి. మానవారాధనే భగవదారాధన. అదే మోక్ష సామ్రాజ్య సముపార్జనకు ఏకైక సాధన.

ఏం మాటలండీ ఇవి—

ఆరోజూ ఈరోజూ అనకుండా అన్ని రోజులూ భగవంతుని సృష్టిలో ఒకటే అన్నారు. శకునాలు పిరికిపందలకే గాని గుండె ధైర్యం కలవారికి కాదనీ, శకునాలను పాటించడంవల్ల నష్టమేకాని లాభంలేదనీ ఉద్ఘాటించారు. ఉపవాసాది వ్రత చర్యలన్నీ పొరపాటన్నారు. అన్నిటికీ ఒప్పుకున్నాం. మడులూ తడల్లో ఏమీ లేదంటున్నారు. అదీ ఒప్పుకోవచ్చు. ఇప్పుడీ విగ్రహారాధనకూడా విడిచి ఏదో మానవారాధన చెయ్యమంటున్నారే...ఇది ఎంత శాస్త్రవిరుద్ధమో ఆలోచించండి.

ఆలోచించే చెబుతున్నా. ఇది శాస్త్ర విరుద్ధంకాదు; శాస్త్ర సమ్మతమే.

అదెలా?

చెబుతావిను;

చెప్పండి చూస్తాను.

ప్రశ్నం జాగ్రత్తగా విను—

వేదంలో ఏమన్నారో తెలుసా—

శ్లో॥ అగ్నౌ క్రియావతో దేవో,
హృది దేవో మనీషిణామ్,
ప్రతిమా స్వల్ప బుద్ధీనామ్,
జ్ఞానినామ్ సర్వతః శివా:॥

అంటే- అనుకున్న పనిని చేయగలిగినవాడు భగవానుని అగ్నిలో దర్శిస్తాడు; ఉన్నతిభావం కలవాడు హృదయంలో చూస్తాడు; స్వల్పబుద్ధి ప్రతిమలో దర్శిస్తాడు. కాని జ్ఞాని భగవానుని సర్వత్రా దర్శిస్తాడు—

తెలిసిందా... విగ్రహారాధన తప్పనుకాని, భగవానుని ప్రతిప్రాణిలోనూ చూడాలంటాను. అదే గొప్పతనం.

శ్లో॥ శివమాత్మాను పశ్యన్తి,
ప్రతిమాసు నయోగి నః॥

అన్నారు. అంటే— యోగులు భగవానుని తమఆత్మలోని దర్శిస్తారు. విగ్రహాలలో చూడరు—

ఇలా ఎన్నో చెప్పగలను.

ప్రతిప్రాణిలోనూ భగవాను నెలా దర్శించగలం.

అదే చిత్రం కష్టం. నిన్ను నీవు తెలిసికుంటే ప్రపంచాన్నంతా తెలిసికోగలవు. నీలోఉన్నా పరమాత్మే అందరి

లోనూ ఉన్నాడనే ఆత్మసూత్రాన్ని పాటించి, అద్వైతసిద్ధి పొందడమే మానవకర్తవ్యం.

ఏమిటో మీమాటలు అర్థం కావడంలేదు.

ఏముంది స్పష్టం! ప్రతివ్యక్తి భగవత్ స్వరూపుడని ప్రేమించడం నేర్చుకో.

మాలాళ్ళను తురకాళ్ళను కూడానా?

తప్పక. జాతిమత కులవిభేదాలు పాటించరాదు. అవి స్వార్థమానవ కల్పితాలేకాని భగవల్లిఖితాలు కావు.

అలాగా...వాళ్లకీ ముక్తి లభిస్తుందీ!

తప్పక.

దుర్మార్గునికైనా ఒకనాడు ముక్తిలభిస్తుందంటారా!

తప్పక, అదే వివేకానంద చెప్పాడు.

ఏమని?

మానవుడు తప్పునుంచి మంచికి ప్రయాణం చెయ్యడం లేదు, అంటే అసత్యాన్నుంచి సత్యానికి ప్రయాణము చెయ్యడంలేదు, సత్యాన్నుంచి సత్యానికే ప్రయాణంచేస్తున్నాడు, అంటే కొద్దిసత్యాన్నుంచిపరిపూర్ణసత్యానికే ప్రయాణం చేస్తున్నాడు.

అలాగా.

అందుచేత ప్రతివ్యక్తి ఒకనాడు కాకపోతే మరొక నాడైనా, మోక్షసామ్రాజ్యంలో సభ్యుడౌతాడు.

ఓహో!

పూర్ణం! స్వామి శివానంద చెప్పినట్లు మానవుడొక్క ప్రపంచంలోనే వాడు కాదు, ఎన్ని ప్రపంచ కాలాలోనో వాడుకు... నీకేలోకంలోని ప్రజలే బంధుమిత్రులుకాగ—ఎన్నిలోకాలలోని ప్రజలో బంధుమిత్రులు అసలీ మానవకోటి అంతా ఒక్క సంఘం. దానిలో నీవొక సభ్యానాలవు.. ఈసృష్టంతా ఒక దేవాలయం దాంట్లో నీవొక చిత్రానివి—

గాంధీజీ చెప్పినట్లు—

అంటే భగవంతుడనే కుమ్మరిచేతిలో బొమ్మలకు తయారుచేసే మట్టిముద్దలం.

అవునవును,

"Your mission in life is service of your fellow-men. అని గాంధిజీ చెప్పినట్లు నీ జీవిత సందేశం ఏమిటంటే నీ తోటి సోదరులకు సేవచేయడమే. కార్మిక కర్షకుల కన్నీటి చుక్క రాలితే నీ జీవితం నత్తైటిపొంగులా పొంగిపోవాలి ప్రజాసేవలో నీ జీవితాన్ని పూజాపుష్పం చెయ్యాలి.

అయితే ఈ విగ్రహారాధన, దేవాలయాలలోకి వెళ్ళ డం, శాస్త్రపఠన ఇవన్నీ అవసరం లేదంటారా?

కొంతవరకు అవసరం కావచ్చు. పూర్తిగా అదే ప్రాధాన్యం కాదు.

అహా!

దీనికి వివేకానంద ఏం చెప్పాడో తెలుసా—

"Man is to become divine by realising the divine. Idols or temples or churches or books are only the supports, the helps, of his spiritual childhood: But on and on he must progress"

అంటే— మానవుడు తన ఆత్మలో దైవత్వాన్ని దర్శి స్తూ దైవం కావాలి. విగ్రహాలు, దేవాలయాలు, చర్చిలు, గ్రంథాలు ఇవన్నీ తోడ్పడతాయ్; ఆత్మీయవిజ్ఞానానికి, అభ్యు దయ మార్గానికి సాయం చేస్తాయ్. కాని అతడు వానితో ఆగిపోరాదు— ఉన్నతపథంనుంచి మహోన్నత పథానికి ప్రయాణం చేయాలి. అభ్యుదయం పొందాలి. ఆత్మజ్ఞానము నొందాలి. స్వతంత్రం అనుభవించాలి.

ఓహ్హం! శాస్త్రాలు మంచివి కావని నేనను— కాని శాస్త్రాలు పేరుచెప్పి మానవులు నడిచే డొంక తిరుగుడు పడకలను నేను ఖండిస్తాను.

మానవాభ్యుదయానికి సర్వమానవ సౌభ్రాతృత్వానికి, సర్వమానవ సమత్వానికి, ఆత్మీయజ్ఞానానికి, సత్యశాంత శమదమాది సద్గుణాలకు మార్గం చూపని—

# శాస్త్రాలెందుకు?

'అలాగే.'

"వృష్ణం! ఎవరో ఒకరు చెప్పారని ఏపనీ చెయ్యక. బుద్ధినుపయోగించి ఆపనిని తర్కించు. మంచిదైతే చేయ్. చెడ్డదైతే విడిచేయ్.

అయితే ఈమడులూ తడులూ విడిచేశా. భోంచేద్దాం పదండి.

పదమరి.

ఇద్దరూ ఆనందంగా పిల్లలతో భోజనం ప్రారంభించారు.

ఇప్పుడు మిట్టమధ్యాహ్నం అయింది; నాకూ ఆకలేస్తుంది. భోంచేసి "దేవుడున్నాడా?" అనే నవల ప్రారంభిస్తా. దీనిలో శాస్త్రం పేరజరిగే అన్యాయాలు విమర్శించా, దానిలో భగవంతునిపేర జరిగే అక్రమాలు సోదాహరణగా

విమర్శిస్తా. అసలు దేవునెలా మానవుడు సృష్టించాడు! ఎందుకు సృష్టించాడు! అవన్నీ చర్చిస్తా, నాఆంధ్ర మిత్రులు దానినికూడా కాస్త ఓపికతో చదవాలని నాశ

ఇక సెలవా మరి.

శ్రమిచ్చినందుకు మన్నించండి—

ఉంటా—

ప్రజాకవి

జంపన

సమాప్తి.

———

త్వరలో రాబోవు

శ్రీ మానాపురం అప్పారావుపట్నాయక్

వారి నవలలు.

1 డాన్సింగ్ మాష్టర్.

2. దొమ్మరిసాని.

3. రంగు మతాబా.

4. పక్షీంద్రుడు.



వలయువారు,

వేంకటేశ్వర పబ్లిషింగ్ హౌస్,

రాజమండ్రి.

# 1946లో
# జంపనవారి గ్రంథాలు
## వెలువడబోయేవి

1. దేవుడున్నాడా?
2. దేవుడు లంచగొండా?
3. దేవుడికి పూజాస్తోత్రాలెందుకు?
4. ఆచారాలెందుకు?
5. కుల మతాలెందుకు?

♦ ♦ ♦

6. స్త్రీ-సంఘంలో బానిసా?
7. స్త్రీ పిల్లల్ని కనే యంత్రమా
8. స్త్రీ-చదువుకోసగాదా?

♦ ♦

9. పేదసాదలు
10. కార్మికుల కష్టాలు
11. కర్షకుల కష్టాలు

♦ ♦ ♦

12. ఎగురీత
13. నేటి బి. ఏ. లు
14. కోటివిద్యలు

♦ కూటికొరకే

15. తల్లి లేని పిల్ల
16. కోటీశ్వరుడు
17. భూలోకస్వర్గం

♦ ♦ ♦

సోల్ డిస్ట్రిబ్యూటర్స్—

రాజహంస బుక్ డిపో, రాజమండ్రి.

# విద్వాన్
# పైడిపాటి సుబ్బరామశాస్త్రిగా
# కావ్యములు

| | | | |
|---|---|---|---|
| 1. తూణీరం | (సెటైర్) | 0 | 8 0 |
| 2. వేశం | (గేయాలు) | 0 | 8 0 |
| 3. నీలం | (కథలు) | 0 | 8 0 |
| 4. ఆంధ్రశ్రీ | (పద్యాలు) | 0 | 12 0 |
| 5. ఉషాసుందరి | (నాటకం) | 1 | 0 0 |

★ త్వరలో ★

| | |
|---|---|
| కవిరాజు | (నవల) |
| ఖడ్గతిక్కన | (జంగం కథ) |
| పైడిపాటి నాటికలు | (నాటికలు) |


## పైడిపాటి ఆఫీస్

నుదురుమాటి బిల్డింగ్స్

బ్రాహ్మణవీధి- బెజవాడ

# జంపనవారి రాజోత్ర గ్రంథాలు.

1. దేవుడున్నాడా?
2. దేవుడు లంచగొండా?
3. దేవునికి పూజాల్లెందుకు?

◆ ◆

4. వచ్చాడే మా బావ
5. ఆచారాలెందుకు?
6. కులము కా లెందుకు?

◆ ◆

7. స్త్రీ సంఘంలో బానిసా?
8. స్త్రీ పిల్లల్నికనేయంత్రమా?
9. స్త్రీ చదువుకోరాదా?

◆ ◆

10. పెదసాదలు
11. కార్మికుల కష్టాలు
12. కర్షకుల నష్టాలు

◆ ◆

13. ఎదురీత
14. నేటి బి. ఏ., లు
15. కోటివిద్యలు కూటికొరకే

◆ ◆

16. తల్లిలేనిపిల్ల
17. కోటీశ్వరుడు
18. భూలోకస్వర్గం

◆ ◆

సోల్ డిస్ట్రిబ్యూటర్సు:—

**రాజహంస బుక్ డిపో, రాజమండ్రి.**

Title Printed at 'RAJAHAMSA' Rjy Q. H. No. E. G. 54.
Date 30-3-46 Copies 750.